ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీ మత్ప్రాహూరు

# వేణుగోపాల

# కృష్ణశతకము.








పూనూరు బోర్డుస్కూలు, ప్రధానోపాధ్యాయులగు

దూపాటి నారాయణాచార్య

ప్రణీతము.



విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.

1926.



ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః



శ్రీ మత్స్వామి

# వేణుగోపాలకృష్ణశతకము

పొన్నూరు బోర్డుస్కూలు, ప్రధానోపాధ్యాయులగు

**దూపాటి నారాయణాచార్య**

ప్రణీతము.



విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.

1926.

# తొలిపలుకు.



ఈ చిన్నిపొత్తమునం దచ్చొత్తించిన సీసపద్యములను రచియించిన శ్రీమదాచార్యవర్యులు నాకు నూతన పరిచితులరే. అయినను పూర్వగ్రంథ పరిచయముచే వారు నాకు చిరమిత్రులే యగుదురు. శ్రీయాచార్యవర్యులు నన్ను పీఠికను వ్రాయగోరుటంత సమంజసముగా లేదు. ఏలయన! నేను అల్పజ్ఞుని, కుక్షింభరుని వారు పండితులు శబ్దవిదులు అట్టివారి కవిత్వమును నేను విమర్శింపబూనుట కేవల హాస్యాస్పదము. కనుక పద్యములు మిగుల రసవంతములుగను, భావగర్భితములుగను, స్వభావోక్తులుగను, శైలి మృదుమధురముగను, పండిత పామర జనైక సువేద్యముగను నున్నదని జెప్పుచు శ్రీకృష్ణపరమాత్మ యీకవివర్యుని యింకను ననేకోద్గ్రంథ రచనకు గడంగు సాహసౌదార్యముల నాశీర్వదించునుగాక యని కోరుచు విరమించుచున్నాడను.

8–10–1926 సం॥<br>
చేబ్రోలు<br>
గుంటూరు జిల్లా.

ఇట్లు<br>
విన్నవించు విధేయుడు<br>
ఇలపావులూరి శ్రీరాములు.

# ఓమ్

## విజ్ఞప్తి.

రసజ్ఞులారా!—

రచనలన్నిటిలో "శతకరచన" మిగుల దుర్ఘటమని పెద్దల యాశయము. నేనా! అల్పమతిని. నాకుఁ గల సంస్కృతాంధ్రభాషా పరిచయమా! మిగులస్వల్పము. కవిత్వ రసానుభవమా! శూన్యము. ఇట్టి నారచన కిదియె ప్రథమ ప్రయత్నమగుటచే, నిందు గుణములు తక్కువయనియు, దోషములెక్కువ యనియుఁ బండిత పాఠకలోక మెఱుంగకపోదు. కాని, యీశతకప్రచురణ కొక ముఖ్యకారణముకలదు. తప్పొప్పులను పాటింపక, రసపోషణోల్లాస మాలోచింపక, యథాశక్తి నీకృతి రచించి, పఠించునపుడంతయు, నానిర్హేతుకదయామాన కరుణాకటాక్ష పరిపాలితభక్తుఁడగు శ్రీకృష్ణ పరమాత్మ నాహృదయమున కనిర్వాచ్యసుఖ మొడఁగూర్చుచుండెడి వాఁడు. "ఏకస్స్వాదునభుంజీయాత్" అను లోకోక్తిననుసరించి, అట్టి యాత్యంతికసుఖ మితరులనుగూడ ననుభవింపఁజేయ వీలగునే మోయ నిడి యడియాస, నన్నదీనిని

ముద్రిత గ్రంథరూపముగఁ బ్రచురింపఁ బ్రేరించినది. ఈపని నేనెంతవఱకు సానుకూలపఱుపఁ జాలితినో, నిర్ణయించు స్వాతంత్ర్యముఁ బాఠక మహాశయులకే విడిచి పెట్టితిని.

ఈశతకము సుమారు రెండున్నర వత్సరముల క్రిందటనే పరిసమాప్తి చేయఁబడి, దాదాపు, యిరువదిమాసములక్రితము, అప్పట్లో, యిచటి బోర్డు, స్కూలులో ప్రథానోపాధ్యాయులుగా నుండు, శ్రీ. ఆ. సుబ్బారావుగారి ద్వారా, చేబ్రోలు, వేదాంత గ్రంథనిలయాధ్యక్షులగు మ. రా. రా. శ్రీ, ఇ. శ్రీరాములుగారి చెంతఁజేరినది. వెంటనే, ముద్రింపించుయోగ్యత నాకుఁగలుగమిచే, ఆ ద్వారకాంతయు "యోగక్షేమం వహామ్యహం" అనిచెప్పిన వానిమీఁదనే పెట్టి నేనూరకుంటిని.

ఇట్లుండగా, వేదాంతమతగ్రంథ విచారపరిచారకులగు మ.రా.రా.శ్రీ. ఇ. శ్రీరాములుగారి యమోఘాశీర్వాద బలమహిమనో, మత్ప్రియనుహృదులగు, శ్రీ ఆ. సుబ్బారావుగారి, నిశ్చలభక్తి భావగరిమనో, మత్ప్రియ శిష్యులునూ, చిరంజీవులగు, శ్రీపూనూరు భక్తసమాజము"వారి యాదరాతిశయ విశేషముననో, లేక, పూనూరి వేణుగోపాలుని నైసర్గికవత్సలత్వ విలసనము

ననో, యీశతకమునకిప్పటికి ముద్రితగ్రంథ స్వరూపమే ర్పడినది. ఏతచ్ఛతక ప్రకటనకయి, తమతన్మమన, ధన సాయ మొనర్చిన, పయిహారందఱికిని నేనెంతయుఁ గృత జ్ఞుఁడను.

మఱియు, పూనూరు దేవాలయ స్థలపురాణమును యథాసక్రమముగ సంగ్రహించి, యీశతకములోఁ జేర్చ వలసినదని, యుచటి నాప్రియమిత్రులు కొందఱుకోరిరి. కాని, యీస్థలపురాణము కేవల నిరాధారమైన పుక్కిటి పురాణమగుటచే నిదమిద్ధమని నిరూపించి వ్రాయఁదగిన విశ్వసనీయోపపత్తి లభింపమి విరమించితిని. కావున వారు నన్ను క్షమింతురుగాక.

సదయహృదయులగు చదువరులు, యిందలిదోష ములను దెలిపినచో, వాటిని బునర్ముద్రణమున సవినయ ముగ సవరించుకొనెదను.

"ప్రస్థయే సర్వవిదుషో, క్షంతుం మాంతుశతానిచ
యద్యత్రికుత్రచిద్దోషో, నిర్మలంకురుతాదరాత్."

బోర్డుస్కూలు
పూనూరు
ది. 27-9-26.

ఇట్లు విన్నవించు
విబుధజనవిధేయుఁడు
దూపాటి నారాయణాచార్యులు.



శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీమత్పూహాను

# వేణుగోపాలకృష్ణశతకము



శ్రీ యాదవాన్వయ • క్షీరనీరధిపూర్ణ
చంద్ర; చంచత్కృపా • సాంద్రహృదయ
శౌర్యధైర్యస్థైర్య • చాతుర్యసద్గుణ
ధామ! నిర్జితమత్త • దైత్యసీమ!
శిశుపాలచాణూర • జీవసమీరభు
జంగాయమాన! వి • హంగయాన
కంసాదిరాక్షస • గర్వపర్వతపాక
శాసన! ధర్మసం • స్థాపనాఢ్య

తే॥ గీ॥ నీరజేక్షణ! భక్తచ • కోరచంద్ర!
గాత్రజితమేఘ! బుధజన • స్తోత్రపాత్ర!
భుక్తిముక్తిఫలప్రద! • భువననేత!
వరద! పూనూరు వేణుగో • పాలకృష్ణ.

2. సీ. శ్రీరుక్మిణీమన • స్సారసమదభృంగ!
సదమలతరపాద • జనితగంగ!
మురళీవినిర్గత • మోహనస్వరసుధా
రసవశ్యసచరాచ • రప్రపంచ!
గోపకాంతాకుచ • కుంభోపగూహన
పరవశీకృతచాతు • రశరీర!
ఘోరగంభీరసం • సార పారావార
తారణోపాయప్ర • ధానతరణి
తే॥ గీ॥ దివ్యభూషణ శోభాప్ర • దీప్యమాన
శంఖచక్రగదాఖడ్గ • శార్ఙ్గహస్త
అవ్యయానందకందళి • తాంతరంగ
వరద! పూనూరు వేణుగో • పాలకృష్ణ.

3. సీ. శ్రీవేణుగోపాల • శ్రితజనసురభూజ
నిరుపాధికంబగు • నీదుకృపయు
సకలభూతములను • సంరక్షణము సేయు
పావనంబగునీదు • ప్రాభవమును

మహనీయభువన ని । ర్మాణచాతుర్యవై
భవయుక్తమగునీదు । భవ్యకీర్తి
ధర్మంబునిల్ప య । ధర్మనాశముఁ జేయు
నిరుపమానంబగు । నీదుప్రతిభ
తే॥ గీ॥ కుతుకమలరారఁగనుఁగొని । శతకమొండు
కాన్కఁగాఁ జెప్పినాఁడనో । కమలనయన
కరుణతోఁ డీనిఁగొనినన్ను । గావుమయ్య
వరద! పూనూరువేణుగో । పాలకృష్ణ.

4\. సీ. ధరఁగవిత్వపటుత్వ । తత్వవిజ్ఞాన పీ
యూషపానానంద । యుక్తులైన
వ్యాసవాల్మీకాది । భాసురకవిసోము
లనుమానసంబున । వినుతిఁ జేసి
కాళిదాసాది స । త్కవిపుంగవుల నెల్ల
సమ్మదంబున మది । సంస్తుతించి
ఆంధ్రకవిత్వత । త్వార్థకోవిదులగు
నన్నయాదుల నెద । సన్నుతించి
తే॥ గీ॥ భక్తిపరిమళపూరిత । పద్యపుష్ప
దామమునుగూర్చి నీకంఠ । సీమనలరఁ
జేయువచ్చితిఁగాని ధన్యుఁ । జేయవయ్య
వరద! పూనూరువేణుగో । పాలకృష్ణ.

5\. సీ. ధరణిమంగళగిరి । తిరుమలదూపాటి
వంశదుగ్ధాబ్ధిజై । వాతుృకుందు
శ్రీవిశిష్టాద్వైత । సిద్ధాంతవరసూత్రి
సంప్రదాయార్థవి । శారదుండు
సంస్కృతాంధ్రకవిత్వ । సాహిత్యచాతుర్య
విలసితశేముషీ । బలయుతుండు
మద్గురువర్యుండు । మంత్రోపదేశకుం
డైనవేంకటగురు । మాననీయు
తే॥ గీ॥ పాదపద్మమ్ములనుమదిఁ । బ్రస్తుతించి
యీకృతికినిమ్నబతిఁ జేతు । నోకృపాబ్ధి!
భక్తమానసపరతంత్రి! । భవ్యగాత్రి!
వరద! పూనూరు.

6\. సీ. అవిరళానంద సౌ । ఖ్యములఁగూర్చెడునీదు
నామంబుస్మరియించు । నాల్కనాల్క
నిరుపమానంబగు । నీకథామృతమును
స్థిరభక్తిఁగ్రోలెడు । చెవులుచెవులు
నీపాదతులసిని । నిత్యమాఘ్రాణించి
ముదమందుచుండెడు । ముక్కుముక్కు
నీదివ్యమంగళ । నిర్మలదేహంబుఁ
గాంచుభాగ్యముగల । కండ్లుకండ్లు

తే॥ గీ॥ నినుసతంబుభజించెదు మానసముమనసము
కరమునీకర్పణము సేయు కర్మకర్మ
తదితరములన్నియును నిరర్థకములయ్య
వరద! పూనూరు.

7. సీ. కరములున్నందుకు నిరతంబు నీపాద
జలజములపూజ సలుపవలయు
పదములున్నందుకు పావనముగనీదు
సన్నిధి విశేషంబు జనఁగవలయు
మస్తకమున్నందుకు మనసారనీపాద
ములవంక బడిసాగి మ్రొక్కవలయు
కాయమున్నందుకు కలకాలమును నీదు
పరిచర్య భాగ్యంబు బడయవలయు
తే॥ గీ॥ కలిమిలేములు సతములు గావుతండ్రి
బాహ్యవేషములు నీవు బముగనీవు
నిత్యకైంకర్యలాభంబె సత్యమయ్య
వరద! పూనూరు.

8. సీ. శంతనసుతుభాతి మంతనంబుననిన్ను
దిటవుగాఁగట్టి బంధించలేను
వినురునిరీతిబల్ విందులుబచరించి
చవులూరఁజేసెడి శక్తిలేదు

పార్థునివిధమున । బంధుభావముఁజూపి
కలసిమెలంగుభా । గ్యంబులేదు
అలఁగాచెడిగోప । బాలురవలెనిన్ను
బొందులాభంబునా । కందలేదు
తే॥ గీ॥ చంద్రునకునూలుపోగన్న । చందమేను
శక్తికొలఁదినిసేవరి । చర్యఁజేతు
నాకుఁబ్రాపయిరక్షింపు । మోకృపాబ్ధి!
వరద! పూనూరు.

9\. సీ॥ జలనిధి జలకణం । బుల నెట్టులైనను
గట్టిపట్టునలెక్క । పెట్టవచ్చు
పటుప్రయత్నంబులఁ । బరమాణువులసంఖ్య
గణనసేయఁగవచ్చు । కాలసరణి
వర్షధారలను ధీ । బలపరిశ్రమమున
నెడతెంపుదలలేక । నెన్నవచ్చు
ఆకాశపథమున । నలరారుచుక్కల
గుత్తులుగనిపెట్టి । కూడవచ్చు
తే॥గీ॥ అంతమేలేని నీదుక । ల్యాణగుణము
లెఱిఁగి లెక్కింప నేతికిఁ । దరముకాద
టన్న ? శక్యంబె! అజ్ఞుండ । నైననాకు
వరద! పూనూరు.

10\. సీ॥ నేత్రపర్వంబుగా । నినుజూచుటకుఁగదా
అమరనాథుఁడు సహ । స్రాక్షుఁడయ్యె
భక్తిపెంపుననిన్ను । వర్ణించుటకుగదా
శేషాహి సాహస్ర । శీర్షుఁడయ్యె
కడఁకమై నీకూడి । గము సల్పుటకుగదా
రవి స్థిరంబుగ సహ । స్రకరుఁడయ్యె
మితిలేని నీగొప్ప । స్థితిఁదెల్పుటకుగదా
చదువులెన్నో సహ । స్రంబులయ్యె

తే॥గీ॥ పిరలందఱు నాకొక్కొక్క । వేయికనులుఁ
దలలుఁ గరములుఁ జనువులుఁ । గలిగినంత
మాత్రమున పాత్రులా? నీమ।హిమఁ బొగడ
వరద! పూనూరు.

11\. సీ॥ భువనంబులన్నియుఁ । బ్రోవఁజాలిననీకు
బలమునకొకమేర । గలదె! ఈశ!
బ్రహ్మాండముల బహు। రమణీయముగఁ జేయు
నీకౌశలమునకు । నిలువుగలదె
బ్రహ్మాదిస్తంబప । ర్యంత భూతములందు
గ్రిందుగానుండు నీ । ఘనతకొలఁదె
కోటిసూర్యులకాంతి । గోటఁమీటఁగఁజాలు
నీతేజమునకొక । నియతిగలదె

తే.గీ॥ ఎల్లయున్నదె; నీమనం । బుల్లపద్మ
పత్రనిభనేత్ర సదపాంగ । పాతవిభవ
మునకు నెటనేని? సర్వేశ! । వనజనాథ!
వరద! పూనూరు.

12. సీ॥ బ్రహ్మాండ మందుండు । ప్రతిపదార్థమునందు
నిండియుండునుగదా! నీదురూపు
అత్యద్భుతంబుగా । నన్నిటనుండుని
వందకుందువయ్య । మందమతికి
జగములన్నియుఁ బ్రోశ । స్తముగనీబొజ్జలో
నిమిడియుండునుగదా! । విమలహృదయ
ఇట్టి జగత్కర్త । నేకాంతభక్తుఁడు
యెట్లునిల్పునో తన । హృదయమందు

తే.గీ॥ అతివిచిత్రచరిత్రుఁడ । వయ్యనీవు
నీమహిమ నెవ్వఁడెఱుఁగునో । నీరజాక్ష
నీవయుద్దాని నెఱుఁగుదో । దేవదేవ
వరద! పూనూరు.

13. సీ॥ కనులపండువుసేయు । ఘనసృష్టియందును
కర్ణపేయంబగు । గానమందు
రసనకు మిక్కిలి । పసఁగూర్చుచవులందు
లలిమీఱు మలయాని । లంబునందు

ఘ్రాణతర్పణమైన । గంధాంబునందును
సంతసంబునఁ దేలు । స్వాంతమందు
సంసారవిషయక । సౌఖ్యసంపదలందు
విమలకళాకలా । పములయందు
తే॥గీ॥ సర్వకార్యములందును । సకలవస్తు
సంతతులయందు సతతంబు । సదయస్ఫూర్తియు
నిన్నుగని సంతసించునో । నిర్వికార !
వరద! పూనూరు.

14 సీ॥ ఆద్యంతములేని । ఆకసంబునుగాని
చలువలఁజిలికించు । నెలనుగాని
వెన్నుఁడనఁబెన్పు । వేఁడివేల్పునుగాని
తళతళలాడు చు । క్కలనుగాని
సస్యంబులను బెంచు । జలధారలనుగాని
భంగసంగతమగు । వార్ధిగాని
ఉన్నతశిఖరశి । లోచ్చయంబులఁగాని
సురుచిరసలిల ని । ర్ఝరులఁగాని
తే॥గీ॥ గాంచినపుడెల్లఁ జెప్పశ । క్యంబుగాని
హర్షమునఁదేలుచుందునా । యంతరంగ
మందు సర్వాత్మ! యొందేని । యుందువయ్య !
వరద! పూనూరు.

15. సీ॥ చెలువారు నీసృష్టి । చిత్రమ్ములనుజూచి
ఆనందమొందని । అక్షులేల ?
ఉత్తమంబైనట్టి । యుపనిషదర్థ వి
స్ఫురణఁ దేలని శ్రోత్ర । పుటములేల ?
నీలసద్గుణగణ । నిత్యానుసంధాన
పరతఁ గాంచఁగ లేని । వక్త్రమేల?
నీకుత్సవంబుల । సేవింపఁగఁజాలని
భాగ్యవంతుల భోగ । భాగ్యమేల ?
తే॥గీ॥ అంతరింద్రియ బహిరింద్రి । యములనెంచి
నిశ్చలంపుఁ బత్తి నిప్పుడు । నీదుపూజ
సలుపలేనట్టి వ్యర్థంపు । జన్మమేల ?
వరద! పూనూరు.

16. సీ॥ తులలేని సిరిసంప । దలతోడఁ దులఁదూఁగు
ధనికునకవి శాశ్వ । తములుగావు
సర్వసర్వంసహా । చక్రమేలెడుభూమి
పాలుఁడు రాష్ట్రంబుఁ । గోలుపోవు
దేహపాటవమునఁ । దేజరిల్లెడుమహా
బలునికి సత్త్వాది । తొలఁగిపోవు
సురుచిరాకార వి । స్ఫూర్తిరాజిలువాని
వైభవమంతయు । వడలిపోవు

తే॥గీ॥ సర్వమును గాలమహిమచే । సమయుఁగాని
త్వత్కృపారస పూజజా । తప్రభూత
మోక్షసుఖమెన్నటికిఁ జెడి । పోవదయ్య !
వరద! పూనూరు.

17. సీ॥ కలుషములగు తలఁ । పులఁ గలుగఁగనీక
మనమును దిద్ది పా । వనముఁ జేసి
మునుకొని నీచంపుఁ । బనులకుఁ గడఁగను
పాణియుగంబును । బాగుసేసి
నిరుపయోగములగు । పరుషవాక్యములాడు
నోటికి వ్యాపన । శాంతిఁ గూర్చి
పాపమహాఘాలఁ జేయు । బుద్ధిని సంసార
ముంచి, విజ్ఞానంబుఁ । బడయఁజేసి

తే॥గీ॥ సర్వకరణంబులను నీప్ర । శస్తమైన
సేవసలుపుట కలవడఁ । జేసితయ్య
దీనులకు నిల్లనీవెకా । దివ్యతండ్రి !
వరద! పూనూరు.

18. సీ॥ జపతపస్స్వాధ్యాయ । సత్కర్మపరులగు
మునులకు శమదమ । ములనుఁ గూర్చి
వివిధశాస్త్రార్థకో । విద సమూహమునకు
వినయవిధేయత । లనువిధించి

ధనధాన్య విభవ వి । స్తారశోభితులకు
వితరణగుణమును । వెలయఁజేసి
ధైర్యసాహసల న । త్యార్యలంపటులకు
సదయార్ద్ర హృదయంబు । సంతరించి
తే॥గీ॥ నీవుపకార విధులను । నేర్పుమీఱ
సతము నెఱవేర్పఁజేసితో । సత్యరూప
నీవపారకృపాజల । నిధివిగావె !
వరద! పూనూరు.

19. సీ॥ పుణ్యనదీనదం । బులకు పాపములను
గూల్చుబల శక్తినిఁ । గూర్చినావు
చంద్రసూర్యాగ్ని న । క్షత్రపంక్తికి దివ్య
దీప్తులక్ష్మిలిఁ బ్రసా । దించినావు
సౌందర్య సౌరభ్య । సౌకుమార్యంబులను
ప్రసవజాతికి పొందు । పఱచినావు
ఇక్షుకాండమ్మున । కింపగుమాధుర్య
రసమగ్గలంబుగా । నొసఁగినావు
తే॥గీ॥ కవులవాక్కుల నమృతంబుఁ । గల్పినావు
నీవినోదంబు లమితాద్భు । తావహములు
వానిఁజెప్పఁగ నేనెంత । వాఁడనయ్య !
వరద! పూనూరు.

20. సీ॥ స్పర్శవేదినిదాఁకి । సర్వలోహములును
బంగారు మయములై । పరిణమించు
సంజీవకరణిచే । జడపదార్థములెల్లఁ
జైతన్యమునఁ బొంది । ప్రీతిఁ జెందు
దివ్యసుధారస । ద్రవ్యమన్నిటిజరా
మరణంబులను బాపి । మనఁగఁ జేయు
కోరికల్ పైరులఁ । గోసులంబుగఁ బెంచి
ఫలియింపఁ జేయుఁ గ । ల్పద్రుమంబు
తే॥గీ॥ దురవగాహంబు సృష్టివ । స్తువులమహిమ
అట్టిసృష్టికి గర్తవై । నట్టినిన్ను
నెట్లు వర్ణింపవలయునో । తెలుఁగనయ్య !
వరద! పూనూరు.

21. సీ॥ ఆర్తులఁ బ్రోచెద । వనుటకు ద్రుపదేశు
కొమరిని గాచుటే । గొప్పసాక్షి
అతిబలోపేతుండ । వనుటకు కొనగోటఁ
గొండనెత్తుటయె బల్ । దండిసాక్షి
అత్యంత సులభుండ । వనుటకు గోపాల
బాలుర చెల్మియే । ప్రబలసాక్షి
ఆచార్యముఖ్యుండ । వనుటకు గీతార్థ
తత్త్వప్రబోధమే । తగినసాక్షి

తే॥గీ॥ జగదధీశుఁడవనుటకు । జగమునీదు
శాసనముదాటకుండుటే । సాక్షితండ్రి!
సర్వసాక్షుఁడవగునీకు । సాక్షులేల ?
వరద! పూనూరు.

22. సీ॥ ముచికుందు నతిమెచ్చి । మోక్షసామ్రాజ్యసిం
హాసనాసీనుగాఁ । జేసినావు
పార్థునిభక్తి తా । త్పర్యములకుమెచ్చి
విశ్వరూపమును జూ । పించినావు
భాగీరథీపుత్రు । భావశుద్ధికిమెచ్చి
దివ్యబోధముఁ బ్రసా । దించినావు
కూర్మిఁగుచేలుని । గుణసంపదకుమెచ్చి
యీప్సితార్థంబుల । నిచ్చినావు
తే॥గీ॥ మునిసతీ జనపూజలఁ । దనిసినావు
మించి సౌజన్యవృత్తిఁ జూ । టించినావు
స్వామి! నినుఁగొల్చువారల । కేమికొదువ
వరద! పూనూరు.

23. సీ॥ దుష్టశిక్షణయును । శిష్టరక్షణయును
జేతికంకణములో । శ్రీశనీకు
ఆర్తపోషణమును । నార్యతోషణమును
బెట్టని సొమ్ములో । దిట్టనీకు

భక్తవాత్సల్యంబుఁ । బరమసౌలభ్యంబు
సత్స్వభావంబులో । స్వామినీకు
అవ్యాజకరుణయుఁ । నభయదానంబును
దివ్యగుణంబులో । దేవనీకు
తే॥గీ॥ మార్దవంబొంటఁబుట్టిన । మచ్చునీకు
సకలకల్యాణ గుణరత్న । సాగరుఁడవు
గాన నినుజేరినాఁడనో । కమలనాథ!
వరద! పూనూరు.

24. సీ॥ రుక్మిణీరమణీసు । రుచిరలతావేష్టి
తము సుమనస్సేవి । తము నిరతము
వేదశాఖాపత్రిశో । భితము కళాపత్రి
రాజమానము కవి । రాట్స్మరణము
పురుషార్థఫలవిభా । సురము నిర్మలశమ
చ్ఛాయావిశేషసౌ । ఖ్యాయతనము
శుకవాగమృతఝరీ । శుభ్రకంకణపోషి
తము సర్వభూతహి । త విలసితము
తే॥గీ॥ అయిన శ్రీకృష్ణమందార । మాశ్రయింతు
సూరివర్యుల కిహపర । సుఖములెల్లఁ
గరతలామలకంబులు । గావెతండ్రి!
వరద! పూనూరు.

25. సీ॥ ఘనపాపములఁ బాపు । కొనుటకై మితిలేని
దానంబులను జేయఁ । బూనుటయును
అనుమానములమాన్పు । కొనుటకై పలుమారు
బుద్ధిమంతులఁ జూడఁ । బోవుటయును
తనదోషములఁ దోలు । కొనుటకై నిష్ఠతో
జపములు తపములు । సలుపుటయును
ఎనలేని కలుషంబు । లను నీఁగికొనుటకై
జన్మంబులెన్నియో । జఱుపుటయును
తే॥గీ॥ కాలహరణంబునకు ముఖ్య । కారణములు
తావకాంఘ్రి సరోజచిం । తనము సకల
పాపహరమును మోక్షసా । ఫల్యకరము
వరద! పూనూరు.

26. సీ॥ దురితాటవులకు వి । స్ఫురదగ్నిహోత్రంబు
ఆపదద్రులకు వ । జ్రాయుధంబు
వివిధమనోరోగ । బిసతంతుపాళికి
గంధబంధురమత్త । సింధురంబు
అజ్ఞానరూపగా । ఢాంధకారమునకు
నరుణప్రభాకరమండ । లోదయంబు
తీరని దారిద్ర్య । వారివాహములకు
భూరిజవోపేత । మారుతంబు

తే॥గీ॥ సకలపురుషార్థఫల జయ । సాధనంబు
భవమహార్ణవ తరణంబు । పావనంబు
నీదునామంబు సంతతము । నిరసనంబు
వరద! పూనూరు.

27. సీ॥ శ్రీమంతమగు నీదు । నామబీజంబును
నారదముని భువి । నాటెనాఁడు
ధ్రువుఁడు నిశ్చలభక్తి । తోఁ బాదుఁ జేసెను
ప్రహ్లాదుఁ డుదకధా । రలను జిలికె
అరుసంబుమీఱ రు । క్మాంగదరాజర్షి
అంకురింపించె ని । రంకుశముగ
చెలువుగ భీష్ముండు । చిగురింపఁ జేసెను
ద్రౌపది పర్ణాళిఁ । బ్రబలఁ జేసె
తే॥గీ॥ విదురు నలరారఁ జేసెను । కరి; శుకుండు
పక్వఫలములఁ గాయించె । భక్తులీఫ
లములఁగను మెక్కి త్వత్పదా । బ్జములఁగంటి
వరద! పూనూరు.

28. సీ॥ మాధవ గోవింద । మధుసూదన ముకుంద
వసుదేవనందన । వారిజాక్ష!
గోపికావల్లభ । గోపరిపాలక
గోకులావాస శ్రీ । గోపవేష!

వేణునాదవినోద! । చాణూరమర్దన
శిఖిపింఛభూషణ । శిష్టపక్ష!
భవపాశలుంఠన । స్తవనీయచారిత్ర
హరి పరాత్పర దయా । పర మురహర
తే॥గీ॥ జగదధీశ పరంధామ । సర్వశక్తి
యనుచు నీనామచింతన । మనుదినమును
సలుపునటుఁజేయుమయ్య నా । స్వాంతమందు
వరద! పూనూరు.

29. సీ॥ సతతంబు నీభక్త । జనపాద సంస్పర్శ
గలుగుట భవనంబు । గలఫలంబు
అనిశంబు నీదాస్య । మునుసల్పుబిడ్డలు
గలుగుటవంశంబు । గలఫలంబు
నిత్యంబు నీనామ । నిర్మలస్మరణంబు
గలుగుట జన్మంబు । గలఫలంబు
భువి సదానినుగొల్చు । పుణ్యులనర్చింప
గలుగుట సంపద । గలఫలంబు
తే॥గీ॥ అనవరతమును నీసత్క । థామృతంబుఁ
గ్రోలిముదమందు భక్తుల । గూడియుండఁ
గలుగుటయె మిత్రబృందముఁ । గలఫలంబు
వరద! పూనూరు.

30. సీ॥ ఆర్తానులాపంబు । లాలకించెదవంచు
నినుఁ జేరినాఁడనో । నీరజాక్ష !
భక్తులకష్టముల్ । పారఁదోలెదవంచు
నిను గొల్చినాఁడనో । నిర్మలాత్మ !
సకలార్థసిద్ధుల । సమకూర్చెదవటంచు
భావించినాఁడనో । పరమపురుష !
దోసంబులన్నియుఁ । దొలఁగఁద్రోతువటంచు
మొఱవెట్టినాఁడనో । మురవిదారి !
తే॥గీ॥ భక్తరక్షణనీకు సు । వ్రతముగాన
భూరికృపతోడ ఘోరసం । సారభయని
వారణముఁజేసి నన్నుఁగా । పాడుమయ్య !
వరద! పూనూరు.

31. సీ॥ కమలంబు కమలాప్తుఁ । గాంక్షించువిధమున
కుముదంబు చంద్రుని । గోరుభంగి
ఇందిందిరము మక । రందంబు పగిదిని
చాతకంబబ్దంబు । చఁదమునను
కోకిలంబెలమావి । కోరుంజవ్వనులమాడ్కి
ఘనలలి చకోరము చంద్రి । కలను వోలె
రాయంచ గంగాత । రంగంబుకైవడి
ప్రజ సధర్మ్మండగు । రాజురీతి

తే॥గీ॥ జన్మబంధంబులను దెగ్రించి । శాశ్వతంపు
సౌఖ్యమొడగూర్చు నీపాద । సరసిజములఁ
జూడఁగోరెదనయ్య నా । చూడ్కులలర
వరద! పూనూరు.

32. సీ॥ నీపాదములెగదా । నిర్మలగంగాభ
వానీసముద్భవ । స్థానికములు
నీయంఘ్రులేగదా । నిగమాంతపుష్పసం
ఛారపారీణవు । స్పర్శయములు
నీపదంబులెగదా । నిత్యంబు పద్మాల
యా విలాస ప్రియం । భావుకములు
నీయడుగులెగదా । నిర్వాణసౌభాగ్య
సీమకలంకార । శేఖరములు

తే॥గీ॥ నీచరణపద్మములెగదా । నీరజాస
నాది సురసంచయమున క । వ్యాజసౌఖ్య
సంపదలనెల్ల సమకూర్చు । సాధనములు
వరద! పూనూరు.

33. సీ॥ బహుపాపములొనర్చి । భయపడువారికి
నీపదాబ్జంబులే । ప్రాపుతండ్రి !
స్వార్థరాహిత్యప । రార్థ తత్పరులకు
నీపదాబ్జంబులే । ప్రాపుతండ్రి !

దుస్తరసంసార । దుంఖపీడితులకు
నీపదాబ్జంబులే । పాఱిపుత్తండ్రి!
పరమపదావాస । భాగ్యలాలసులకు
నీపదాబ్జంబులే । పాఱిపుత్తండ్రి!

తే.గీ॥ సకలచేతనులకునీదు । చరణసేవ
ఆపదుద్ధారకము మహా । తాపశాంతి
కరము నిశ్శ్రేయసానంద । కందమయ్య
వరద! పూనూరు.

౩౪. సీ. కర్ణకుండలములఁ । గాంతులు చెక్కు
ట్టములకు నిద్దంపుఁ । దళుకులీన
నాసభాగానత । వదనకంజమునకు
భూరివిలాసమొకింత । పొలుపుగొలుప
ఒక కాలువంచి వే । ఱొక కాలఁ గీలించు
హొయలు నిల్పునకొక్క । యొప్పులొలుక
అధరబింబమ్ముతో । నంగుళీయకరుచుల్
పిఱిఁగొని మురళికిఁ । జెలువులొత్త

తే.గీ॥ చారుమోహన గోపవే । షంబుఁ దాల్చి
బ్రహ్మగాంధర్వగీతంబుఁ । బాడు నీదు
రూపుఁ గనులకు విందుగఁ । జూపవయ్య!
వరద! పూనూరు.

35. సీ. మాధరా! ఉద్ధృత । భూధరా! పింఛవా
మాధరా! విష్టప । నాథ! రారా!
శ్రీకరా! పరమద । యాకరా! సుగుణర
త్నాకరా! వైభవా । స్తోక! రారా!
సుందరా! వైకుంఠ । మందిరా! సత్కటా
క్షేందిరా! నుతమౌని । బృంద! రారా!
మానరా! నినుగొల్వఁ । బూనరా? నను బ్రోవ
పోనురా! నిను వీడి । నాన! రారా!
తే॥గీ॥ వాఙ్మనస్సులకందని । వాఁడరాఁ!
భావమునసీదు చరణరా । జీవయుగము
శరణుజొచ్చితిఁగావరా । పరమపురుష!
వరద! పూనూరు.

36. సీ. నీరూపు! శాశ్వత । నిశ్శ్రేయసానంద
ఫలసంపదర్థిక । ల్పద్రుమంబు
నీచూపు! సద్భక్త । నికరమానసపార
సాకరంబునకుఁ బ్రి । భాకరంబు
నీప్రాపు! చేతనా । నీకదుస్తరదుఃఖ
పటలంబునకు వజ్ర । పంజరంబు
నీకాపు! సతతంబు । నిఖలచరాచర
భూతంబులకు దేహ । పోషణంబు

తే॥గీ॥ తాపహరణంబు సేవ్యంబు । నిపదంబు
నిర్భయకరంబు సుఖదంబు । నీకరంబు
చిత్తమలహరణంబు నీ । చింతనంబు
వరద! పూనూరు.

37. సీ. ప్రతిఫలాపేక్షర । హితముగశుద్ధ జ
లంబులవర్షించు । నంబుదంబు
మాత్రేలుఁగోరక । మంచితియ్యనిపండ్లఁ
జల్లనినీడ న్వృ । క్షములొసంగుఁ
బ్రత్యుపకార రా । హిత్యముగానుధా
కరుఁడుకైరవములఁ । గ్రాలఁజేయుఁ
దానయాచితముగఁ । దామరసాప్తుండు
జలరుహాకరముల । నలరఁజేయు

తే॥గీ॥ జగదవనమల్లనీకును ! సహజగుణము
శ్రితజనాళికి సకలవాం । ఛితములిచ్చు
దేవుఁడవుగానఁ గోర్కెలు । లేవునీకు
వరద! పూనూరు.

38. సీ. సర్వభూతములందు । సమమైననిర్లేతు
క ప్రేమఁగలమహా । ఘనుఁడవీవు
కర్మానుగుణ్యంబుఁ । గా జీవకోటికి
ఫలములొసంగు నే । ర్పరివినీవు

కాలానుసారంబుఁ । గాఁ గష్టసుఖములఁ
బ్రాణులకిచ్చెదు । ప్రభుఁడవీవు
అఖిలజంతువులకు । హాయిగా నాహార
మొదగూర్చెడు దయామ । యుఁడవునీవు
తే॥గీ॥ జీవులకు మంచిచెడుగులఁ । జిత్రముగను
బంచిపెట్టెదునిప్పుడు । పాలివీవు
ఎఱుఁగ శక్యంబె? నీచిత్త । వృత్తిఁ జక్రి!
వరద! పూనూరు.

30. సీ. ఒక్కకాలమునందుఁ । బెక్కుదినాలకు
యుద్భవించుటకు నీ । యందునేని
బాంధుగా నందఱో । చందురులోకపరిఁ
గోచరింపఁగఁజను । కూండునేని
విద్యుల్లతలు వేన । వేలొక్కపర్యాయ
మెట్టులైనను బాడ । కట్టునేని
చిక్కులపోవులు । పెక్కు లొక్కటిఁగాఁగఁ
జేర్చుసాధనతట । స్థించెనేని
తే॥గీ॥ నిరుపమజ్యోతిపుంజమై । వఱలునీదు
సత్కళాంశములకు వాని । సాటిసేయ
వచ్చునని మదిఁదలఁతునో । స్వచ్ఛరూప!
వరద! పూనూరు.

40. సీ. పరుగిడు సేతన । పనియనుకొనుగాని
భానుండునీకు మా । బ్బులుకఁ జెప్పు
వీచుట యేతన । విధియనుకొనుగాని
ప్రీతినీకుఁ జెప్పదు । పవనుఁ డెప్పు
తల్లిఁగనిమరియుండు । తనకృత్యమనకొనుగాని
మేఘుఁడునోరుఁ । గదలనీఁడు
భారంబుమోయుట । బాగనుకొనుగాని
తానను రాఁడదు । ధరణినీకు

తే॥గీ॥ దేవ జీవేశ్వరుఁడవగు । నీపు శిష్ప
సర్వతంత్రస్వతంత్రుండై । జగములెల్ల
నీ నిరంకుశశాసనం । జేసెఁ జెప్పను!
వరద! పూనూరు.

41. సీ. పగఁబూనిపలునూరు । ప్రాణిహింసయొనర్చు
పాపాత్ములనురూపు । మాపుదీవు
పరయుక్తసామాన్య । జంతుహితముఁ జేయు
పుణ్యాత్ములనుబ్రీతిఁ । బ్రోతువీవు
భూతములెచెలరేఁగి । పోరాడువేళల
బ్రీమానుబంధంబుఁ । బెంతువీవు
విషమస్థితులునంధి । వించువేళలధర్మ
పక్షంబునకుఁదోడు । పడుదువీవు

తే॥గీ॥ ఎచటనుండువో? రూపమ । ద్యేదియో? నీకుఁ
దోలుఁగన్నులు నినుజూడఁ । జాలవయ్య!
దినము రవినీదు చండశా । సనముఁజాటు
వరద! పూనూరు.

42. సీ. స్థావరజంగమా । త్మక మహాబ్రహ్మాండ
కోటులెన్నియొ నీదు । కుక్షినిముడు
సచరాచరములగు । సకలభూతములందు
నీకళాంశాంశమే । నిండియుండు
కేళివిలాసంబు । గా లోకములనెల్ల
వెలిఁవార్చి నీలోన । వేసుకొనఁడతు
ప్రకృతినిగుణవికా । రములఁబొందుగఁగూర్చి
భువనముల్ నిర్మించి । ప్రోచిత్రుంతు

తే॥గీ॥ గానసృష్టిస్థితివినాశ । కారకుఁడవు
బొమ్మలాటలు నీకీజ । గమ్ములెల్లఁ
బుట్టఁజేసి భరించిమా । పుటలుతండ్రి
వరద! పూనూరు.

4?. సీ. నీపవిత్రభావములను । నీస్వభావములను
నీచరిత్రములను । నీగుణముల
నీపవిత్రాపములను । నీవినోదములగు
సృష్టిస్థితిలయాద్ది । చిత్రములను

అతిరహస్యములగు । హరిశిరస్సీమలఁ
బ్రకటించితివిమహా । ప్రౌఢసరణి
తత్వజ్ఞాతా । తజ్ఞులవారిని
శ్రద్ధాగరిష్ఠులై । చదివిచదివి
తే॥గీ॥ సంధియములన్నియునుబాసి । సకలయోగి
పూజ్యమైనట్టి మోక్షసా । మ్రాజ్యపదవిఁ
జెంది ముదమొంది నినుఁగూడి । యుండురయ్య
వరద! పూనూరు.

44. సీ, తల్లిదండ్రులమాఁకి । డయలోఁ దనపరాధ
శతములసహియించి । సాఁకుదీవు
ప్రాణమిత్రునిరీతిఁ । బరివిధముల
క్షేమవిచారణల్ । సేయుదీవు
కరుణామయుండగు । నరపతికైవడిఁ
గీడులన్నియుఁదోలఁ । గింతువీవు
ఆప్తబంధునివోలె । నధికాదరంబునఁ
గష్టంబులనుదీర్చి । కాతువీవు
తే॥గీ॥ దిక్కునీవేయటంచు చిం । తించుప్రజల
నెంతమదదృష్టుఁడనో? । నిన్నుఁజింతసేయు
బుద్ధిపుట్టదు! నన్నెట్లు । బ్రోతువొక్కొ!
వరద! పూనూరు.

45. సీ. కామరాగద్వేష । కల్మషగంభీర
వారిశీకరచయ । పూరితంబు
కామవాతోద్ధూత । ఘనమోహవీచికా
మాలికాఖిల సం । కీలితంబు
పుత్త్రపౌత్త్రకళత్త్ర । ఘోరనక్రగ్రాహ
సముదాయ సంరావ । సంకులంబు
ద్వంద్వోత్కరావర్త । భయదంబు దాపత్త్ర
యాదిగ్రసంఘమహోగ్ర । యుంకరంబు
తే.గీ॥ నైనసంసారసాగర । మందు మునిఁగి
తీరమెఱుఁగకయున్నాఁడ । దేవ నీదు
శ్రీచరణనావచేఁ దరిఁ । జేర్పవయ్య
వరద! పూనూరు.

46. సీ. కనుభయంకరములగు । కాలకింకరమూక
లురిత్రాళ్లఁ బ్రాణంబు । లూడఁ బెఱుక
ఆలుబిడ్డలును జు । ట్టాలుఁ జుట్టను జేరి
గీ,గా, యటంచు శో । కించుచుండ
ఆసుందుపనికిరా । దీమందుఁ బోయుద
మంచు వెజ్జులు తొంద । రించుచుండ
కఫవాతపిత్తముల్ । గ్రిమ్మకుత్తుకపీకఁ

తే॥గీ॥ మదినినుదలంతుననెడి న । మ్మకము లేదు
కాన, నిప్పుడె నిన్ను నా । మానసాబ్జ
మందు నెలకొల్పి ధ్యానమిం । పొందఁ జేతు
వరద! వానూరు.

47. సీ॥ సత్పురుషులతోడ । సాంగత్యమొనరించి
మంచివాఁడనఁగ లభ్య । సించలేను
గురువులకడఁ జేరి పరిచర్యలను జేసి
సత్ప్రబంధంబులఁ । జదువలేను
ధరణిఁ దేవతలగు । తల్లిదండ్రులకుప
చార ధర్మములను । సలుపలేను
వర్ణాశ్రమాచార । నిర్ణీతవిధులను
నేర్పమీఱఁగ నెర । వేర్పలేదు

తే॥గీ॥ మంచియను మాట సున్నఁగా । నెంచవలెను
చెడుగుపనులన్ని వరుసఁగాఁ । జేసినాను
శిక్షయో! రక్షయో నీదు । చిత్తమయ్య!
వరద! వానూరు.

48 సీ॥ బాలక్రీడలఁగొంత । కాలమాయువునందుఁ
గమునిరర్థకముగఁ । గడచిపోయె
ఆయువులోసగ । మఱిగె నిద్దురయందుఁ
గామాంధమునగొంత । గతముఁ జెందె

లౌకికవ్యవహార । లక్షణంబులఁ గొంత
కాలంబు వ్యర్థమై । తూలిపోయె
నీరసంబైన సం । సార తాపత్రయ
బాధలచేఁ గొంత । భగ్నమయ్యె
తే॥గీ॥ జీవితంబిట్లు వ్యర్థంబుఁ । జేసియిపుడు
నీపదంబులె దిక్కని । నిక్కవముగ
నమ్మితినిగావుమయ్య । యనాథనాథ!
వరద! పూనూరు.

49. సీ॥ ధీచమత్కృతిఁ జూపి । నీచరిత్రములను
సొంపుగా వ్రాయ వ్యా । సుఁడనగాను
'కృష్ణా' యటంచని । గీతంబు లేపొద్దు
రహిమీఱఁ బాడ నా । రదుఁడఁ గాను
భక్తిరసంబుబ్బ । ప్రవహించునట్లు నీ
సుచరిత్రములఁ జెప్ప । శుకుఁడఁ గాను
నీకథామృతమును । నిరతంబుఁ దృప్తిగాఁ
గ్రోలి సుఖింప భ । క్తుఁడనుగాను
తే.గీ॥ పరమమందుఁడ నత్యంత । పాతకుఁడను
శరణుజొచ్చితినయ్య నీ । చరణయుగము
శిక్షనొనరిచి నన్నుర । క్షింపుమయ్య!
వరద! పూనూరు.

50. సీ॥ చేదోయిఁ జోడించి । శిరమునఁ గీలించి
చిత్తమిట్టట్టులఁ । జెదరనీక
ప్రత్యంగమానంద । పరవశత్వముఁ జెంది
పులకలు మేనెల్ల । మొలకలెత్త
నయనయుగ్మమునను । నందాశ్రువులు రాలఁ
గద్గదస్వరమున । గళము వడఁక
భవదీయకోమల । పాదాంబుజద్వయ
ధ్యానసుధారస । పానులగుచు
తే॥గీ॥ నిరతిశయభోగ్య కందమై । వఱలు నీదు
సుందరాకారమును గాంచి । చొక్కు యోగి
జనవరేణ్యుల జన్మమే । జన్మమయ్య!
వరద! పూనూరు.

51. సీ॥ దందశూకమును బూ । దండఁగా ధరియించు
విషమమృతంబుఁగా । వేడ్కఁ గ్రోలు
జలములఁ బెనుగండ । శిలలను దేలించు
జ్వాలదవలము కర । ములను దాల్చు
అర్ణవంబర చేత । నాపోశనముఁ జేయు
సోమసూర్యుల నొక్క । చోటఁ బెట్టు
సర్వసర్వంసహా । చక్రంబుఁ జాపఁగాఁ
జుట్టఁ జుట్టి బుజానఁ । బెట్టుకొనును

తే॥గీ॥ నిన్నుగొల్చెడు భక్తుఁడో । నిర్వికార
నిన్నుఁగనులార సేవించు । నిర్మలులకుఁ
గష్టతరకార్యములు కొన్ని । గలవెతండ్రి
వరద! పూనూరు.

52. సీ॥ దురభిమానంబును । దుష్టసాంగత్యంబు
నతిశయమగు దుర । హంకృతియును
సతతంబు సంసార । సౌఖ్యాభిరతియును
మదివివేకంమన్య । మానతయును
దుర్మార్గవృత్తియు । దుర్వ్యసనంబును
నానయులోభంబు । నీసురోసుఁ
బ్రాముఖ్యగుణములై । బాధించుటంజేసి
నీపదస్మరణంబు । నీదుసేవ

తే॥గీ॥ సల్ప నామనసొప్పదో । జగదధీశ
ఈచెడుగుణంబులనడొల్గ । దోంచియుమ్మ
దంఘ్రి పరిచర్యఁజేయుభా । గ్యంబునిమ్మ
వరద! పూనూరు.

53. సీ॥ వేదవేదాంతార్థ । విహితబోధాసక్తి
ఆచార్యచరణ సే । వానురక్తి
నిత్యంబు సాధుసాం । గత్యప్రవృత్తియు
శాస్త్రనిషిద్ధహిం । సానివృత్తి

సత్కార్యకలనాప్తి । సక్తియు యాదృచ్ఛి
　　కార్థసంతృప్తియు । నార్జవంబు
శాంతియుదాంతియు । సత్వసంశుద్ధియు
　　క్షమయును ధృతియును । సత్యనిరతి
తే॥గీ॥ మొదలుగాగల సద్గుణం । బులుమహాత్మ !
నిన్నుఁ గొల్చు జనులకున్నను । కొన్నిజన్మ
శతములకునైన లభియింప । శక్యమయ్యె !
వరద! పూనూరు.

51. సీ॥ వీరుమామిత్రులు । వీరుమాశత్రువు
　　లంచుజనుల్ కల । హించుచుంగ్రు
జంతుసమూహమ్ము । త్సరసీరుహంబుల
　　నీస్వరూపమెగదా । నిండియుండు
అట్టిచో సర్వాత్మ । యొట్టులీమిత్రత్వ
　　శత్రుత్వభేదముల్ । సంభవించె ?
నీమాయటందువా? । యేమిలాభమునీకు ?
　　యిట్లుమమ్ములభ్రాంతి । యుంపఁజేయ
తే॥గీ॥ మాదుకర్మంబటందువా? । నీదుభక్త
వత్సలత్వ పరినక్తికి । భంగమయ్యె!
కనుకననుదెల్పి నినుఁజూపి । మనుపవయ్య !
వరద! పూనూరు.

55. సీ॥ పారంబులేని సం । సారాబ్ధిమునుఁగులై
జీవయాత్రను జేయు । చేతనులకుఁ
బ్రారబ్ధకర్మము । బంధమై నిరతంబు
దుఃఖించి చౌకఁగా । వారకుచుండు
జగదీశ జనులకుఁ । లోకవస్తువునందుఁ
గోర్కెలుగావున దాని । గూర్చినావు
శాశ్వతానందాఖ్య । సంపద నీపద
సేవకులకు నీవుఁ । జేసినావు

తే॥గీ॥ గాననీపరిచర్యను । మానకెప్పుడుఁ
జేయువిధమును జూపినా । చిక్కులన్ని
దీర్చి నీసేవకులలోనఁ । జేర్చుకొనుము
వరద! పూనూరు.

56. సీ॥ నీయాజ్ఞయునియును । నీకాముఖోల్లాస
కరమనియును గని । కరము కరము
నీకుఁగల్గునటంచు । నియమితచిత్తేంద్రి
యుండనై నీపాద । యుగ్మమెప్పుడు
మామకహృత్పద్మ । మందిరంబుననుంచి
చింతఁజేసితినేని । గొంతయైన
దయపుట్టకుండునే । తండ్రి నాపైనీకు
నీవకారణకృపా । నిధివిగావె !

తే.గీ॥ నీకనుగ్రహముదయించె । నేనినాడు
తప్పులన్నియు మన్నించి । తక్షణంబె
నామనోరథమీడేర్ప । వే మహాత్మ!!
వరద! పూనూరు.

56. సీ॥ నక్యాంబునకునీవె । సంరక్షకుండవంచు
నెమ్మది దృఢముగా । నమ్మినాఁడ
నిశ్చలభక్తితో । నీపాదజలరుహ
ములె సేవ్యములటంచుఁ । గొలుచువాఁడ
ఫలమొసఁగిననే । తొలఁగఁద్రోచిననే
నిందాస్తుతులఁ జేసి । నిన్నునీవ
మూర్ఖుఁడనైనన్ను । మోహవారాశిలో
ముంచవద్దని నీకు । మ్రొక్కువాఁడ
తే.గీ॥ నిన్నుఁబొందంగఁబెట్టను । నీకెకరుణ
యెప్పుడుకలుగునో! యుండాక । యెదురుఁజూచు
చుందు నామది సంతృప్తిఁ । జెందితండ్రి
వరద! పూనూరు.

58. సీ॥ వ్రేపల్లెగాదిది । రేపుమాపులునీకు
యమునాజలాభిషే । కములొసర్ప
బృందావనముఁగాదు । మందారతరుపుష్ప
ఫలపత్రములఁ నమ । ర్పణముసేయ

మధురాపురముగాదు । మాన్యతరావార
సామగ్రిఁదుష్టిఁగా । సంతరించ
ద్వారకాపురిగాదు । భూరితరైశ్వర్య
వస్తువాహనవైభ । వములఁగూర్ప
తే॥గీ॥ భక్తవత్సల! పూనూరు । పల్లెటూరు
గొప్పవస్తువులిట నము । కూర్పఁజాలఁ
బ్రీతిమన్నానసాజ్ఞము । గ్రింతుఁ దండ్రి
వరద! పూనూరు.

59. సీ॥ కుగ్రామవాసినై । కూమగుడ్డలుగోరి
వరదాన్యవృత్తికిఁ । బాలుమాలి
నీగొప్పదనమును । నీగౌరవంబును
నిట్టిట్టిదనిమది । నెఱుఁగలేక
కడఁకఁబెక్కు దుమాలఁ । గుడుచుచు సుఖమబ్బ
బెట్లాకోయని తపి । యించుచుండ
నిరుపేదయొకఁడు పె । న్నిధిఁగన్న విధమున
నేఁడునాగురుకృప । నిన్నెఱింగి
తే॥గీ॥ అయ్యయో! కాలమంతయు । వ్యర్థమయ్యె
నంచు సంతాపమునుజెంది । యార్తితోడ
నిన్ను జేరితి శరణని । కన్నతండ్రి
వరద! పూనూరు.

60. సీ॥ నీవపూర్వములగు । నిర్దుష్టవస్తువు
లెన్నియో నాకుంచి । మెచ్చియిచ్చి
వానిసద్వినియోగ । వైభవమంతయు
విధినిషేధములతో । విశదపఱచి
కడతేరు మార్గంబుఁ । గల్పింప, కుమతినై
నీసుబోధములను । నీటఁగల్పి
పొగరెక్కి నీచంపుఁ । బ్రాంతలన్నియుఁ ద్రొక్కి
చేటొంది కటకటా! । చెడితినను మ

తే॥గీ॥ పరితపించుచు నీపాద । పంకజములె
గతియనుచు వచ్చితిని తండ్రి । కఠినశిక్షఁ
జేసి, పుత్రునివలెఁ జేరఁ । దీసికొనుము
వరద! పూనూరు.

61. సీ॥ పాపపైశాచ్యోద్రేక । వ్యాకులీకృతమనః
ప్రాణేంద్రియుండనై । పరమపురుష
అక్కటా! ఎన్ని మహా । పరాధములను
జేసియుందునో విప్పి । చెప్పఁజాల
ఈభ్రమరోగము । యితరౌషధములచేఁ
బాయదు శ్రీకృష్ణర । సాయనంబె
దీనికిఁ బ్రాముఖ్య । మైనమందని పెద్ద
లందఱు వచియించి । రయ్యనాకు

తే॥గీ॥ దీనరక్షక! కృపతోడ । దానిగోర్కిచ్చి
మామకీనాంగకముల ని । రామయముగఁ
జేసి, నను జేర్చుకొనుము నీ । సేవకునిఁగ
వరద! పూనూరు.

62. సీ॥ పాపంపుఁగొంపిలోఁ । బడియుండు నను జూడ
వేడుకా నీకు ఓ । విశ్వరూప
ఆపదంబుధిఁ గూలి । అల్లాడు నాగోడు
చెల్లాటమా నీకు । శ్రీనివాస
తాపత్రయములనే । దల్లడిల్లుచు నుండ
లీలటయ్యా నీకు । బాలకృష్ణ
రక్షింపఁజాలియు । పేక్షించియుండుట
ముగతాళియా నీకు । జగదధీశ

తే॥గీ॥ నాకుఁ బ్రాణాంతకము, నీకు । నవ్వులాట
చాలుఁజాలిఁక నీరమా । పాలు తండ్రి
వేగ నన్ఁజేరి రక్షింప । వేణుపాణి !
వరద! పూనూరు.

63. సీ॥ చేతులెల్లప్పుడుఁ । జెడుకార్యములకేమ్పు
చెడుచోట్లకే కాళ్లు । సిద్ధపడును
పండుబూతులకే । పాల్పడుచుండు నాలుక
వీనులు వినరాని । హానికేమ్పు

చూడరానివి నిక్కి । చూడఁగోరుచుకండ్లు
ముక్కుఁ ఘ్రాణించ గంధ । ములకుఁ దివురు
చిత్తంబు చంచలా । యత్తమై విషయవా
సనలయందే ప్రాకు । మునిఁగి తేలు

తే॥గీ॥ ఇంద్రియములిట్లు దుర్న్యయ । వృత్తిమీఱి
కల్మషములయ్యె వానిని । నిర్మలముగఁ
జేసి నీదాసునిఁగ నన్నుఁ । జేసికొనుము
వరద! పూనూరు.

64. సీ॥ దుర్విషయోర్వీయ । తురఁగముల్ చెలరేఁగి
బలిమినామనసును । బట్టియీడ్చి
పేరాసలను నట్టి । కాసుముండ్లకంపలోఁ
బెట్టి లేవఁగనీక । నెట్టికొట్టు
అకట! యీ దెబ్బలందెబ్బ । యమదూతయేకాంత
మేలసియొంటునో । బాలకృష్ణ
గట్టిపట్టునుబట్టి । ఘట్టిబాధలఁబెట్టి
దిట్టివేమారుఁ । గట్టికొందు

తే॥గీ॥ అబ్బనామనసీముష్టి । దెబ్బచేత
నొచ్చినది రావె! కావవే! । సచ్చరిత్ర
ఆర్తరక్షకుండవనుకీర్తి । నాపుకొనవె
వరద! పూనూరు.

65. సీ॥ ఉరిత్రాళ్లలోఁ జిక్కి । యూపిరాడక తన్ను
కొనుచుండు పక్షిలా । గున సతంబుఁ
దత మోహవల్లి వి । తానవేష్టిత భవ
కూపంబువంగూలి । కుందికుంది
దరిఁ జేరుకొనుదారి । దొరకక నాచిత్త
మురియాడుచున్నదో । నరసిజాక్ష
పరబాధలనుఁ దీర్చు । గురుకృపానిధులగు
తమబోంట్లకిఁ జాగు । తగునె తండ్రి

తే॥గీ॥ దురితమోహాలతాలవి । త్రుంచవుగావ !
ఘోరసంసార దుఃఖని । వారకుఁడవు
గావ! అపరాధినగుననుఁ । బ్రోవలేవ !
వరద! పూనూరు.

66. సీ॥ అంటినే శతకోటి । యపరాధములఁ జేసి
యారితేలిన యధి । కారిననుచు
వింటినీవాక్కుండ । వేతప్పులన్నియు
క్షమియించు సర్వాధి । కారిననుచు
కంటిఁ బ్రత్యక్షంబు । గాఁ దండ్రివలెనిన్ను
గరము జగద్ధిత । కారిననుచు
కొంటినీనామంబు । వెంటవెంట స్మరించు
వారికి బహుసౌఖ్య । కారియనుచు

తే॥గీ॥ అ త్తరత్వాధికార ! మో । త్వాధికార !
సర్వభువనాధికార ఓ । నిర్వికార !
శ్రితజనాధార నమ్మర । క్షింపరార !
వరద! పూనూరు.

67. సీ. చాటింతు బాజాబి । జాయించినీకంటె
రక్షకుల్ లేరని । ప్రజలకెల్ల
ప్రకటింతుభవదీయ । పాదద్వయాను సం
ధానమే సుగతి కా । ధారమనుచు
ధరియింతుకౌదల । తావకానుల్లంఘు
నీయశాసనముల । నిండుభక్తి
వచియింతునీదు పా । వనచరిత్రంబులే
పరనీయములటంచు । పాఠకులకు

తే॥గీ॥ సంతసింతునువర్ణింతు । సంస్తుతింతు
మంతనంబుననిన్నుఁ జిం । తింతునెంతొ
అన్నిఁటికినీ పెదిక్కని । యాశ్రయింతు
వరద! పూనూరు.

68. సీ. నీచుఁడ దుష్టుండ । నిర్భాగ్యదామోద
రుండ మహాపరా । ధుండశఠుఁడ
మందుఁడ నధికదు । ర్మానుండ భవపాశ
బద్ధుండ పాపాల । భైరవుండ

విషయలోలుండను । విగతపుణ్యుండను
కపటవర్తనుఁడను । చపలమతిని
దుర్బలుఁడను దైన్య । దుఃఖపీడితుఁడను
సానుతాపార్తిత । స్వాంతయుతుఁడ
తే॥గీ॥ నేమసర్వాపరాధినో । నిర్మలాత్మ
దీనజనరక్షకా! నాకు । దిక్కులేక
పాహిపాహియటంచుసీ । పాలఁబడితి
వరద! పూనూరు.

69. సీ. కాలునా! నీనోటి । రత్నముల్ జలజల
పిలుపు నశోయని । పలికినంత
మునుఁగునా! నీపుట్టి । కనులెత్తినను జూది
తళుకుఁజూపులఁగొన్ని । జలికినంత
తరుగునా! నీసొమ్ము । దయతోడనామొఱా
లించియీయగచాట్ల । మాంచినంత
కందునా! నీచెయ్యి । కరుణారసముకొంత
వల్చినా మొగముపై । రాల్చినంత
తే॥గీ॥ వినియువినవట్లుఁగనియును । గననియట్లు
యుందువేలా! అదియొక । యందమొక్కొ
దేలయీబెట్టు ననుఁజూడ । వేలతండ్రి
వరద! పూనూరు.

70\. సీ. ఎఱుఁగక కొన్నియు । నెఱిఁగియుం గొన్ని
చేఱిఁగి యెఱుంగ । కెన్నొ గొప్ప
లోపముల్ జేసి సం । తాపతప్తుండనై
కావుమటంచుని । కాళ్ళఁ బడితి
శరణాగతత్రాణ । బిరుదు నిల్పదుసుమా
నేఁడు నీ మోడిని । పీడవేని
తప్పఁ జేసిరటంచు । తండ్రులు బిడ్డలఁ
విడుతురే తామెంత । వెఱ్ఱులైన

తే॥గీ॥ కోపమున నాదు లోపముల్ । సైపవేని
ఈశ! నాకింకెవరయ నీయుఁ । దేవుఁడు నీకు
పాపులను గాతువనెడు నీ । ప్రతిమముఖాంక
వరద! పూనూరు.

71\. సీ. గతజన్మములను ప్ర । స్తుతజన్మమందును
వరుసనా సల్పిన । పాపములను
బట్టి నీ శిక్షకు । పాత్రుండననుటకు
సందియమే లేదు । స్వామి నాకు
మాం శరణం వ్రజ । మా శుచ మోక్షయి
ష్యామి పాపేభ్యోయ । టంచు నీవు
పల్కవే ఆపల్కు । బద్ధమా నిజమేని
ననుఁ బ్రోచుట యొ నీకు । న్యాయమయ్య

తే॥గీ॥ నన్ను గావుటనీవిధి । నిన్ను నమ్మి
కొల్చుచుంటయునావిధి । కొత్తగాదు
పూర్వసంబంధమిది । వీడిపోదుమనకు
వరద! పూనూరు.

72. సీ. పాపపరీతులోఁ । బట్టభద్రుండవై
వేదశాస్త్రార్థకో । విదులనెల్ల
విదిలించిజయభేరి । వేసినన్నిప్పు డో
డించనాదండు సా । గించినాఁడ
మనపోరుగనయూరి । జనులందఱును వారి
పనులన్నియునుదీరి । వచ్చిరయ్య
రచ్చమానను నేను । రాజీకనునుగాదు
ధర్మయుద్ధముఁ సేయఁ । దలఁచినాఁడ

తే॥గీ॥ నీతమయు నీదుకృపయును । నీపదాబ్జ
సేవయును నావశంపడఁ । జేసినన్నుఁ
బ్రోచిననుఁగాని, నినువీడి । పోనుతండ్రి
వరద! పూనూరు.

73. సీ. జంఝూనిలోద్ధూత । జలధిభంగమ్ములఁ
బడికొట్టుకొనుచుండు । పడవభంగి
భవసాగరమునందుఁ । బడిజన్మమరణ దు
స్తరదుఃఖధాటికిఁ । దాళలేక

తొలిబాముసందునా । నలిపినఘోరదు
ష్కృతకర్మమెట్టిదో । చిక్కఁదెచ్చి
పెట్టనున్నదో యని । భీతిఁజెందుచు నిన్నె
ఆపదుద్ధరణుండ । వనుచు నమ్మి

తే॥గీ॥ సాయమొనరుపకుర్వ్యా! మొ । ఱో! యటంచు
నార్తితో వేఁడికొంటినో । యార్తరక్ష
ణా మొఱలు నీదు చెవిసోక । వా మహాత్మ
వరద! పూనూరు.

74. సీ. ఉపకారమే గాని । యపకారమెట్టిదో
చేసి యెఱుంగవే । జీవికైనఁ
బాపుడఁగాననా । పాపవ్యథలఁ జెందఁ
జాలక నినునింద । సల్పినాఁడ
నలుగకు మాతండ్రి । యనుభవింతును నాదు
ప్రారబ్ధకర్మ ప్ర । పంచమంత
నమృతరసప్రవా । హము పొంగిపారలు నీ
చరణారవింద సం । స్మరణ నాకు

తే॥గీ॥ శరణమై పాపహరణమై । సకలదుఃఖ
తరణమై మోక్షఫలసమా । చరణమగుచు
నుండులాగు బ్రసాదింపు । మో మహాత్మ
వరద! పూనూరు.

75. సీ. జన్మలన్నిటమర్త్య । జన్మమే మోక్షసా
ధనయోగ్యమనిజను । లనువదింతు
రట్టిసర్వోత్కృష్ట । మైనయీనరజన్మ
మబ్బఁజేసితివిమా । యబ్బవాకు
క్షణభంగురంబిది । చప్పుటవిక్కంబు
పురుషార్థయుక్తుని । స్ఫూర్తిలేదు
కరుణాకరుండవు । గాన,యీదేహంబు
తరియించుటకుమంచి । దారిఁజూపి
తే॥గీ॥ పరమపురుషార్థలాభంబుఁ । బడయఁజేసి
నినుఁదలఁచినప్పుడెల్లనా । కనులయెదుట
నిల్చిరక్షించుభారంబు । నీదితండ్రి
వరద! పూనూరు.

76. సీ. తిండికూరేగును । యొండకురోప్పును
నీడకుఁగోజాడుఁ । బాసికుబ్బు
జంకునువానకుఁ । గొంకునుశీతుకు
దప్పికినుంత్రైనఁ । దాళలేము
వేసాలువేయును । మీసాలుదువ్వును
గాసికోపదుమమూ । వీసమేని
ప్రీతినిమేషంబునుఁ । బరిణామదశలొందు
వీథికిలోఁబడిచచ్చు । వెతలఁగూర్చు

తే॥గీ॥ నీతను వృద్ధినిచే సౌఖ్య । మేమియబ్బు
ననుచు భ్రమియించుచుందురు । జనులు తండ్రి
కడు విచిత్రము నీ మాయ । నుడువఁదరమె
వరద! పూనూరు.

77. సీ. చాడీలఁ జెప్పి హిం । సలఁ జేయఁబూనుట
ఖ్యాతిలాభంబుల । కాశపడుట
బూటకంబుల నాడి । మోసముల్ సేయుట
పాడుచేఁతల కొల్లఁ । బాలుపడుట
వంశంబు జాతియుఁ । బాండిత్యగరిమయు
నున్నతోద్యోగంబు । నెన్నుకొనుట
కలహముల్ పెంచుట । కౌర్యంబుఁ జూపుట
కడగండ్లఁ బడుటయు । గరముఁదగుట

తే॥గీ॥ మఱియు నేమేమి సేయుట । బంధనముల
కాశపడియెడి బాధ । నాశనరుని
చావుఁ దప్పించి మనుచునే । శాశ్వతముగ
వరద! పూనూరు.

78. సీ. గాలిని బిగబట్టి । కట్టవచ్చునుగాని
అతిచంచలంబగు । మతిని లాగి
బంధించి సంస్కారం । పఱచుట కడు దుస్త
రంబుఁ గానున్నదో । యంబుజాక్ష

ఆశాహితులఁగూడి । యాటలాడుటకును
పరదారధనవస్తు । హారణమునకుఁ
బాలుమాలికలేక । పరువులెత్తుదుగాని
వైరాగ్యమనుమాట । పనికిరాదు
తే.గీ॥ పరువుమర్యాదలెఱుఁగదీ । పాడుమనసు
దీనిసంచరణానుసం । ధానమనెడి
మేకునకుఁగట్టి మేఁగూర్పు । వేఁడ్పవార్థి
వరద! పూనూరు.

79. సీ. అస్థిరంబీమేను । ఆలుబిడ్డలునుఁజు
ట్టాలువీడుదురు ప్రా । ణాంతమందు
వీరుపాధికులు సం । సారకారకులునీ
వొకరుపాధికబంధు । వుఁడవుతండ్రి
విడువకెల్లపుడు నా । యెడఁదనుందువునీవు
అజ్ఞుఁడఁగానని । స్మరయులేక
యొందెందోవెతకుచుఁ । గందరగోళముఁ
జెందుచుందునుగుడ్డి । చందమేను
తే.గీ॥ నిన్నుఁగనుఁగొన విజ్ఞాన । నేత్రమొసఁగి
ఆర్తరక్షకప్రాణ ప్ర । యాణవేళ
నీపదధ్యానమేమది । నిల్పుమయ్య
వరద! పూనూరు.

80. సీ॥ తనమెవ్వరికి నీవు । పరమోపకారకృ
త్యములఁ జేర్పంగఁ ద్రిలో । కములయందు
నప్రయత్నముగ మా । యఁగ చాల్లఁబలుమారు
తప్పించికాతువో । తండ్రినీవు
నీసహాయము లేక । నిముసమాత్రంబని
బ్రతుకఁజాలు నెయెట్టి । ప్రాణియైనఁ
బ్రబలతాపత్రయ । భయపీడితులకునీ
యభయహస్తమె గొప్ప । యండతండ్రి

తే॥గీ॥ దీనజనబాంధవా కృపా । బ్ధి పరేశ !
నీవెతల్లివిదండ్రివి । నీవెగురుఁడ
నీవెదైవంబు, సర్వంబు । నీవెమాకు
వరద! పూనూరు.

81. సీ॥ శారీరబాధోప । శమనంబుఁ జేసెడి
వారిపట్లను వస్తు । వాహనాది
పరికరములఁ గూర్చు । వారిపట్లను జనుల్
తమకృతజ్ఞతఁ జూపఁ । దలఁతురిగాని
నిర్హేతుకప్రేమ । నిఖలజంతువులకు
సకలసౌఖ్యములను । సకలవస్తు
సంపదల్ గూర్చు ని । సర్గసుహృదివగు
నీమేలుఁ దలఁపరో । స్వామి! ప్రజలు

తే॥గీ॥ ఇంతకంటె కృతఘ్నత । యేదిగలదు
దీనిఁ దెగటార్చి నీమేలు । దినదినంబుఁ
దలఁచు జ్ఞానోదయముమాకుఁ । గలుఁగనిమ్ము
వరద! పూనూరు.

82. సీ॥ "నారుఁబోసినఁవాడె । నీరుఁబోయు"నటంచు
జనులాడునుడికదు । సత్యమయ్యె
యీనారుఁబోయుట । కీనీరుఁబోయుట
కేమిహేతువొ యెవ్వఁ । డెఱుఁగుదీని
నీయిచ్ఛ, నీమాయ । నీలోకప్రాద్దుఁబు
చ్చు వినోదమనిమదిఁ । జోద్యపడుదు
నవికావు నీకుమా । యందుఁగలట్టిప్రే
మను దెల్పుటకు నిద । ర్శనముతండ్రి

తే॥గీ॥ మమ్ముఁబుట్టించుటకుముందె । మాకుఁబుష్టిఁ
బుట్టఁజేసిన, ప్రేమాంబు । పూరనిధివి
తండ్రియన నీకెచెల్లునో । తండ్రి! జగతి
వరద! పూనూరు.

83. సీ॥ యుష్మదాదార్యగు । ణోన్నతి విభవంబు
వర్ణింప నశక్యవి । శ్వరులుపూని
గొప్ప నద్గ్రంథముల్ । క్రోడీకరించి రూ
చించి త్వదద్భుత । సృష్టినందు

కామధేనువునకో । కల్పవృక్షమునకో
చింతామణికో పోల్ప । నెంతురయ్య
ప్రకృతివస్తువులక । ప్రాకృతపురుషుగు
ణోన్నత సామ్యమె । ట్లొప్పునొక్కొ !

తే॥గీ॥ ప్రకృతివస్తువు జన్మనం । బంధమిచ్చు
జన్మరాహిత్యపదవి నా । సంగుదీవు
యొచటసేవింపు నీయావి । కిమగలదె
వరద! పూనూరు.

౭౪. సీ॥ నీచాకచక్యంబు । నీచమత్కారంబు
నీమహాద్భుతశక్తి । నేర్పుఁజూపి
లూతమగ్గముఁబోలె । లోకజాలంబుని
ర్మించి నీవందుఁ గ్రీ । డించుచుందు
వహహా! బల్చిత్రంబు । అంటదునీకది
మాకది బంధమో । మాన్యచరిత
నీవలలోఁబడి । మొదారిఁదోఁచక
గోల పెట్టుదుమది । లీలనీకు

తే॥గీ॥ ఇంద్రజాలంబు నీమాయ । యెవ్వఁడెఱుఁగు
ధీర! మానసారసీపద । సారసములఁ
జేతికొల్తుము చూపవే । దారిమాకు
వరద! పూనూరు.

85. సీ॥ ఇంద్రియసమదగ । జేంద్రబృందమును వి
జ్ఞానాంకుశము నవ । శ్యముగఁ జేసి
తృష్ణోదకములచేఁ । దృష్ణాగ్నికీలలఁ
జల్లార్చి మనమును । శాంతిబెట్టి
భక్తియోగామృత । వర్షధారాపాత
ముల బుద్ధిఁ బరిశుద్ధ । ముగనొనర్చి
చిత్తబంధరమును । చిన్మరందాబ్ధివి
చీకోలికలనూగఁ । జేసి, బ్రహ్మ

తే॥గీ॥ యోగనిష్ఠాగరిష్ఠులై । యొప్పువరమ
హానిరాశేంద్రిహృదయప । ద్మములఁనీకు
సంతతావాస భూములో । జగదధీశ!
వరద! పూనూరు.

86. సీ॥ శంకరాచార్యుండు । సర్వంబునందునీ
వొక్కండవేనిండి । యుందువనియె
శ్రీభాష్యకారులు । చిదచిత్తులను నియ
మించు యీశుఁడవనీ । వంచుఁదెలిపె
మధ్వవర్యుండు న । మస్తంబునకునీవె
పరిపాలకుఁడవంచుఁ । బ్రచురపఱచె
నెందఱెందఱో భక్తు । లెన్నెన్నొవిధముల
భవదద్భుతవ్యాపా । పమునుపాడె

తే॥గీ॥ హరిసిద్ధాంతములు మహా । భావగర్భ
ములు, మతవివాద కారణం । బులు త్వదీయ
మతమె నామతికభిమత । మతముతంచి
వరద! పూనూరు.

87. సీ॥ పరమపావనములై । భక్తిప్రపత్తిసం
పదలకు తావులై । హృదయపద్మ
భానూదయంబులై । పాపపేషణములై
మృత్యుభీషణములై । యీప్సితార్థ
ఫలదాయకంబులై । వాగ్భూషణంబులై
కర్ణపేయంబులై । కదుమనోహ
రంబులై యమృతర । సంబులై వఱలునీ
సచ్చరిత్రములకు । సమములగునె

తే॥గీ॥ ఫలరసంబులుఁ దేనెలుఁ । బాశకములు!
దీటుదారకర వాటితో । సాటియందు
తేటనీటికిఁ బాలకే । పాటిదీటు
వరద! పూనూరు.

88. సీ॥ అజ్ఞానలతికకు । నంతరంగము పాదు
దురితాంబువులనది । పెరుగుచుండు
నాశదానికి వేరు । యన్యాయమే కాడ
పాడుతలంపులే । పల్లవములు

అనృతవాగ్జాలంబు । లాకు జొంపమ్ములు
క్రూరకర్మంబులే । కుసుమతతులు
వదలని ప్రారబ్ధ । వాసనవాసన
జననమరణములు । ఘనఫలములు
తే॥గీ॥ కాలుపోడయిది, చిమ్మచీ । కట్లఁగ్రమ్మ
కూర! యీపాద పచక్రి । ధారచేత
నగ్గుఁజేయవె, కూర్పవే । లగ్గుశౌరి
వరద! పూనూరు.

89. సీ॥ ఆచార్యపురుషుండ । ననుచుడంబముతోడ
బిరబిరనూరూరుఁ । దిరుగవచ్చు
తామసద్వైవ మం । త్రరహస్యవిధులను
శిష్యకోటికుపదే । శింపవచ్చు
తీర్థప్రసాదముల్ । తృప్తిఁగాలభించి
పెంపొందుడంచు దీ । వింపవచ్చు
అర్థంబుఁ ద్రాణంబు । నాచార్యవశమని
లాలించిశిష్యును । లాగవచ్చు
తే॥గీ॥ విషయవైరాగ్య బోధఁగా । వింపవచ్చుఁ
గాని జనుఁడెంత విద్వాంసుఁ । డైననిన్ను
జిత్తవిశ్రాంతితోఁ జింత । సేయుటరుదు!
వరద! పూనూరు.

90 సీ॥ పరమేశ! త్వత్పాద । పద్మంబులను గొల్వఁ
జాలిన సంపదే । సంపదయ్య
ఇతరమ్ములను మాని । సతతమ్ము నినుఁ గూర్చి
యుండెడి యుల్లమే । యుల్లమయ్య
నినుఁ జెందు మార్గంబు । నేర్పు మీఱఁగఁ జూచి
మెఱయుండు బుద్ధియే । బుద్ధియయ్య
నిరతంబు పరభక్తి । నీపాదసక్తినిఁ
బాయని కాయమే । కాయమయ్య

తే॥గీ॥ నిన్ను సేవింప కన్నులే । కన్నులయ్య
తావకీయకథా సుధా । ధారలెప్పుడు
విందులుగఁ గ్రోలు వీనులే । వీనులయ్య
వరద! పూరాము.

91. సీ॥ నిఖిలభూతములందు । నిండియుండెడి నిన్ను
దిలకించి హర్షాబ్ధిఁ । దేలువాఁడు
సర్వకార్యములని । సంప్రీతికై యాచ
రించ నెల్లప్పుడు య । త్నించువాఁడు
త్వత్పదధ్యానభా । స్వన్మయూఖములచేఁ
జిత్తాబ్జములరారఁ । జేయువాఁడు
కుమ్మరపుర్వులా । గున సంసరణమందుఁ
దిరుగుచు నిన్ను నే । మఱసివాఁడు

తే.గీ॥ భక్తినిష్ఠాగరిష్ఠుఁడై । వఱలువాఁడు
సర్వమర్పించి నీసేవ । సలుపువాఁడు
నీకుఁబ్రియతమభక్తుఁడో । నిర్మలాత్మ
వరద! పూనూరు.

92. సీ॥ అవిరళానంద బా । ష్పార్ద్రనేత్రుఁడై
యొంటిగాధ్యానించు । నొక్కవేళ
హర్షాతిశయ పుల । కాంకితగాత్రుఁడై
మందహాసమొనర్చు । మఱొకవేళ
సంతోషభరమున । సారెసారెకుసాఁగి
మ్రొక్కుచుసాష్ట ని । నొక్కవేళ
యొకవేళనాడును । యొకవేళబాడును
యొకవేళ గిమ్మన । కుండు నొక్క

తే.గీ॥ వేళయుప్పొంగి గంతులు । వేయుచుండు
నిర్మలానందమూర్తిని । నిన్నుఁగాంచి
పారవశ్యముఁజెందెడి । భక్తవరుఁడు
వరద! పూనూరు.

93. సీ॥ నీభక్తుఁడెప్పుడు । నీదాసదాసుల
కడవారినైనను । గారవించు
కులము,వృత్తియు, సంప । దలను,జాతి,మతభే
దముల భూషణ,దూష । ణములఁగాని

పాటింపఁదలఁపను । భర్తవు కర్తవు
సర్వంబు నీవని । సంతసింతు
వత్సమా వును జేర । వాత్సల్యముననది
చేపడే! అట్లనీ? । చేరి నీకు

తే.గీ॥ భక్తుఁడీప్సితములనెల్లఁ । బడయుచుండు
నినువిడిచి నీదుభక్తుండు । నిలువలేఁడు
నీవు నీభక్తునెడబాసి । నిలువలేవు
వరద! పూన్నూరు.

94. సీ॥ నీటిబుగ్గలఁబోలె । నిముసంబులోపలఁ
గాయంబు నాయువు । మాయమగును
మేఘంబులోని క్రొ । మ్మెఱుఁగుతీవెలఁబోలె
భోగభాగ్యములు వి । యోగమొందు
జలధితుంగతరంగ । ములఁబోలె దారాది
సంగమంతయుఁ దుదిఁ । సమసిపోవుఁ
గలలోని చిత్రింపు । కథవోలె యీజగ
న్నాటకమంతయు । నాశమొందు

తే.గీ॥ నందు విజ్ఞాని పనినిం । దించివిడిచి
నిర్గుణంబుగ నీపద । నీరజములె
తనకుగతియని నెమ్మదిఁ । దలఁచికొలుచు
వరద! పూన్నూరు.

95. సీ॥ పత్రిమో పుష్పమో ఫలమో జలమొ నీదు
చరణాబ్జములనుంచి భక్తిగొలంది
నిరతంబు భక్తితో నిన్నుబూజించెడు
ధన్యుండు వాంఛితార్థములఁబడయు
నాశాపిశాచమూ నేశక్తి పీడింపఁ
గుక్షింభరుండు నిన్ను గొల్వలేక
అన్నవస్త్రాభరణాదుల నాశించి
యుబ్బులఁగొల్చి సంకల్పసిద్ధిఁ
తే॥గీ॥ బడయనేరక వ్యర్థుండై చెడును తుదకు
నీవెమట్టంబు పక్షంబు నీవెగతియ
టంచు నీభక్తుఁడెపుడు సేవించు నిన్ను
వరద! పూనూరు.

96. సీ॥ నీలాభ్రజాల సుశ్రీల నేలెడినీదు
మేనిలావణ్యమును పూనిచూచి
తొలికారుమెఱుపుల తళతళ లెగజిమ్మఁ
జాలునీబంగారు చేలుఁజూచి
తొగచెలివగకాని జిగిఁదెగడఁగఁజాలు
సొగసులొల్కెడునీదు మొగముఁజూచి
మగరాల నిగనిగల్ నగఁజాలుకులుకుచే
జిగిమీఱు నీచిఱు నగవుఁజూచి

నకునువిల్లాడు । నామతి! తనకట్టి
దాస్యమొసఁగుడు భవ । త్పరమకరుణ
నబ్బనోయనుప్రీతి । నబ్బిబాష్పాంబుసం
దోహవీచికలలో । దొప్పఁదోఁగు

తే॥గీ॥ అపుర! యేమందు నీయంద । మందుఁ జందు
విందు విందదివలపుల । మందటంచు
నందు పడదియమున్నదే । యిందిరేశ
వరద! పూనూరు.

99. సీ॥ సృష్టిచిత్రములతోఁ । జెలువారు యీభువ
నంబు సభాభవ । నంబుగాఁగ
రవిశశి నక్షత్ర । రాజీవిరాజిత
ప్రభలు తత్సభకు దీ । పములుగాఁగ
గంధవాహానీత । బంధురసౌరభ్య
భంగమ్ములచటిసే । వనలుగాఁగ
అజ, శివ, సుర, మూన । వాది జంతువులెల్లఁ
బరిజన పరివార । భటులుగాఁగ

తే॥గీ॥ సకలబ్రహ్మాండ సామ్రాజ్య । చక్రమేలు
నీవు "పూనూర" వెలయుట । నీపదాబ్జ
సేవకులమగుమమ్మేర । క్షింపఁగాదె!
వరద! పూనూరు.

100. సీ॥ అతిపవిత్రభూతి । మైనయొక్క భవదీయ
దివ్యాలయమె మాకు । భవ్యకాశి
సర్వపాపంబుల । సమయించు త్వత్పదా
బ్జముల తీర్థమె మాకు । విమలగంగ
త్వద్దివ్యచరితామృ । తముఁ గ్రోలు సత్కృత
జనగోష్ఠియే మాకు । సదమలగయ
త్వత్ప్రియభక్తులు । త్వన్మహోత్సవములఁ
జేయుచోటే మాకు । శ్రీప్రయాగ

తే॥గీ॥ త్వత్పదార్చకులె మాకు । పంచకోశి
త్వత్పదధ్యానమే మాకు । పరమధనము
త్వత్ప్రసాదమె మాకు । వనములందిరి
వరద! పూనూరు.

101. సీ॥ చిత్తమా! భక్తితో । శ్రీవేణుగోపాలు
భజియించి ముక్తిని । బడయుమంటి
వక్త్రమా! నిరతంబు । వ్రజసుందరీనాథు
కీర్తనల్ బాడి సు । ఖింపుమంటి
ఘ్రాణమా! కృష్ణాంఘ్రి । రాజీవపరిమళ
తులసిగంధములలో । మెలఁగుమంటి
పాణియుగ్మమ! కృష్ణ । పాదారవిందంబు
లర్చించి సంతసం । బందుమంటి

తే॥గీ॥ అక్షియుగ్మమ! శ్రీకృష్ణు । నరయుమంటి
శ్రోత్రయుగ్మమ! హరికథల । గ్రోలుమంటి
మూర్ధమా! కృష్ణునకుఁ బ్రీతి । మ్రొక్కుమంటి
వరద! పూనూరు.

102. సీ॥ మతకర్తలను బంపి । హితవు బోధింపించి
చేతనాళికి మేలుఁ । జేసినవఁడొ
వర్ణాశ్రమాచార । పథలఁ గల్పించి
మనుజసాంకర్యంబు । మాన్పినవఁడొ
బ్రహ్మసూత్రాదిస । ద్గ్రంథకర్తలనంపి
వేదతత్త్వము లెఱుం । గించెనవఁడొ
న్యాయశాస్త్రము గు । ణ్యంబుగాఁ బ్రజల ను
బాలింపఁ బ్రభువులఁ । బంపెనవఁడొ
తే॥గీ॥ ధర్మసంస్థాపనకు మార్గ । దర్శియెవఁడొ
అట్టి సర్వనియంత । నైనట్టి నిన్ను
సతము స్మరియింతు నిశ్శ్రేయ । సంబుకొఱకు
వరద! పూనూరు.

103. సీ॥ ఎవనిపాద సరోజ । మెప్రొద్దు యోగీశ
చిత్తమందిరములఁ । జెలఁగుచుండు
ఎవనిసాధర్మ్యంబు । నియాత్మ సముదాయ
మంతయుఁ జెందుకా । లాంతమందు

ఎవనియద్భుతశక్తి । యీజగద్యంత్రంబుc
ద్రిప్పుచుండును మొద । లెంపులేక
ఎవనికౌశలమును । నీసృష్టిచిత్రముల్
ప్రకటించు నేత్రప । ర్వంబుగాcగ
తే॥గీ॥ ఎవనియునికి రక్షణమొ । యీభువనములకు
అట్టి సర్వేశ్వరుండవై । నట్టినిన్ను
మంతరంబుననిల్పి ధ్యా । నింతునెపుడు
వరద! పూనూరు.

104 సీ॥ నీసమానులుగాని । నీకంటెనధికులు
గాని నాకెచ్చటc । గానరారు
జగములన్నిటినేలు । చక్రవర్తివినీవు
త్వచ్ఛాసనముc జవ । దాcటుదేది
నీకటాక్షమురక్ష । నీకోపముశిక్ష
సచరాచర ప్రపం । చమునకెపుడు
ఈశ! నీమహిమచే । దేశకాలానుసా
రముగ దేహికి జీవ । నములభించు
తే॥గీ॥ ఆదరంబున మామొఱ । లాలకించి
మాయభీష్టంబులిడు కృపా । మయుcడవీవు
గాన ధ్యానింతునీపద । కంజమెపుడు
వరద! పూనూరు.

105 సీ॥ పరమదయాకర!! । "నిరుపయోగములగు
పనులకు ననుఁబాలు । పఱచకయ్య"
మరణపర్యంతంబు । మఱవక నిన్ను జిం
తించులాగునఁ బ్రసా । దింపవయ్య
అస్మదన్వయులనీ । యారాధనము వీడ
బాయకుండెడులాగు । జేయువయ్య
కరుణతోనాదు యో । గక్షేమములభార
మెప్పుడు నీవె వ । హింపవయ్య

తే॥గీ॥ అంతరాయములేక ని । రంతరంబు
నీదుగీతామృతముఁ గ్రోలి । నిత్యమైన
మోక్షసుఖమందఁజేయుమో । ముక్తిగేయ
వరద! పూనూరు.

106. సీ॥ ప్రజలను సౌభ్రాతృ । భావబంధములతో
వెలుఁగొందులాగుఁగా । వింపవయ్య
ధర్మమేజయమను । నిర్మలవాక్యంబుఁ
బ్రీతినెల్లెడలఁ గ । ల్పింపవయ్య
భూమినెల్లప్పుడు । ముక్కారుపంటల
నలరారులాగున । నలుపవయ్య
అరనిభక్తి ని । న్నాబాలగోపాల
మునుగొల్చులాగున । మనుపవయ్య

తే॥గీ॥ పుత్రికుటుంబము పుత్రజయును । బాడిపంట
గలిగి తామరతంపరై । వెలయులాగుఁ
జేసి, తోడయికాచి । రక్షింపవయ్య
వరద! పూనూరు.

107. సీ॥ మంగళమో దివ్య । మంగళవిగ్రహా
మంగళమో భక్త । సంగనీకు
మంగళంబిదుగో ని । హంగపుంగవయాన
మంగళంబిదుగో ని । స్సంగనీకు
మంగళమో దయా । పాంగ తుంగతరంగ
మంగళమో పాప । భంగనీకు
మంగళంబిదుగో భు । జంగతల్పశయాన
మంగళంబు రమాను । షంగనీకు

తే॥గీ॥ మంజుతర వేణుగోపాల । మంగళంబు
మణివిభూషణ భూషిత । మంగళంబు
మాకు మంగళమిదు నీకు । మంగళంబు
వరద! పూనూరు.

108. సీ॥ జనకుండు "వేంకటా । చార్యుండు" తత్సతీ
తిలకమా । "శ్రీపేరిం । దేవి" జనని
"శ్రీ —సార్యుండు"। ప్రియసోదరుండు నాకు
సరసమౌ పాటివం । శంబుమాది

'నారాయణా'యని । నన్నుబిల్తురు వ్రిజల్
మాయూరు 'చిన్నియ । న్నదల'యుండు
'గీతార్థ' తత్వప్రి । దాతవై వెలయునీ
పాదరాజీవ సే । వాప్రియుండ
తే॥గీ॥ కేవలాజ్ఞుండ యున్మతగ్ని । పావకమునఁ
త్వద్గుణార్ణవమునఁ గొన్ని । పద్యరత్న
ములను దేవితిఁ గొని, నన్ను । బ్రోవుమయ్య!
వరద! పూనూరు వేణుగో । పాలకృష్ణ॥

సంపూర్ణము.



విజయ ముద్రాక్షరశాల, బాపట్ల. 500, 10—26.

